


# చేనేత కబురు

ఫిబ్రవరి 2003, సంచిక I (For private circulation Only)

ప్రియమైన మిత్రులారా,

నమస్కారం. చేనేత విజ్ఞాన విధాన కేంద్రం (CHIP) వెలువరిస్తున్న చేనేత సమాచార పత్రం తొలి సంచిక ఇది. సర్వత్రా పెను మార్పులు సంభవిస్తున్న కాలంలో మార్పు గుణాన్ని పట్టిచూడటం చాలా అవసరం. విధానాలు, విపరిణామాలు, సంఘటనలు-మార్పుకు అన్నీ పుట్టిళ్ళే. విధాన నిర్ణాయక వ్యవస్థలకు, విధానాలు చేసే ప్రక్రియలకు మెజారిటీ ప్రజలు బహుదూరంగా ఉండిపోయిన సమాజం మనది. మెజారిటీ ప్రజల జీవితాలను బలంగా ప్రభావితం చేస్తున్న సదరు మార్పుల మంచి చెడులను బేరీజు వేయడమన్నది కాలక్షేపంకోసం చేసే పని కాదు.

బ్రిటన్‌కు చెందిన ఆక్స్‌ఫాం తోడ్పాటుతో హైదరాబాద్‌లోని సెంటర్ ఫర్ రిసోర్స్ ఎడ్యుకేషన్ (CRE) ఈ కేంద్రాన్ని నెలకొల్పింది. మార్పు ప్రక్రియలో చేనేత రంగాన్ని భాగస్వామిని చేయాలని, మార్పువల్ల ఈ రంగం ప్రయోజనం పొందాలని చిప్ ఆకాంక్షిస్తున్నది. చేనేత రంగంపై ఆధారపడి జీవిస్తున్న వృత్తిపనివారల, చేనేత రంగ శ్రేయోభిలాషుల సహకార భాగస్వామ్యాలతో చేనేతరంగానికి సంబంధించిన సమాచారాన్ని అభివృద్ధిపర్చి వినియోగంలో పెట్టే పనిని ఈ కేంద్రం చేపడుతుంది. ప్రస్తుత సమాచార పత్రం కూడా ఈ కృషిలో భాగమే.

ప్రభుత్వ ప్రతికూల విధానాలు, ప్రపంచీకరణ, మారుతున్న సామాజిక-ఆర్థిక పరిస్థితుల కారణంగా చేనేతకార్మికుల మనుగడ తీవ్ర సంక్షోభంలో చిక్కుకున్నది. చేనేత రంగ పరిరక్షణకోసం పోరాడే వారికి ఒకప్పుడు విధాన నిర్ణాయకవర్గాల్లో ఉన్న గుర్తింపు ఇపుడు లేదు. ఈ రంగాన్ని పట్టించుకునేవారే అసలు కరువయ్యారు. దీంతో చేనేత కార్మికుల జీవితాలను నిలువునా ముంచేసే పచ్చి తిరోగమన నిర్ణయాలను ప్రభుత్వం యథేచ్ఛగా తీసుకుంటున్నది. ఈ దేశంలో కోటి మందికి ఉపాధి కల్పిస్తున్న రంగమిది. ఇది ఆషామాషీ విషయం కాదు. గ్రామీణ ఉపాధి రంగాల్లో వ్యయసాయం తర్వాతి స్థానం చేనేత రంగానిదే. ఇతర సంప్రదాయ వృత్తుల వలె కాకుండా కుటుంబం మొత్తంగా వృత్తిలో పాల్గొంటుంది.

నిరుద్యోగం పెనుసమస్యగా మారిన మన దేశంలో చేనేత రంగం ఇస్తున్న ఉపాధి అవకాశాలను కాపాడుకోవడానికి ప్రభుత్వ పరంగా చేయవలసింది ఏమిటో ఈ సంచికలో ప్రధానంగా చర్చించాం. మీ సలహాలను, భాగస్వామ్యాన్ని కోరుతున్నాం.

డి.నర్సింహారెడ్డి

---

## పెరుగుతున్న నిరుద్యోగం: చేనేత రంగ ఉపాధిని పరిరక్షించాల్సిన ఆవశ్యకత

ఉపాధి కల్పనలో చేనేత రంగానికి ఉన్న ప్రాధాన్యతను ప్రశ్నించేవారెవరూ లేకపోయినా ఉపాధిని దెబ్బతీసే పలు వివక్షాపూరిత నిర్ణయాలను ప్రభుత్వం ఇటీవలి కాలంలో అమలు చేసింది. భారత ఆర్థిక వ్యవస్థలో ఈ రంగానికి ప్రత్యేక స్థానం ఉంది. చేనేత రంగంలో శ్రమశక్తి వినియోగం అధిక స్థాయిలో ఉంటుంది. పూర్తిగా వికేంద్రీకరించబడిన ఉత్పత్తి ప్రక్రియ ఇది. అరకొరగా లభించే పెట్టుబడి వనరులను గరిష్టంగా సద్వినియోగపర్చుకునే రంగమిది. ఇందులో స్వయం ఉపాధితోపాటు రోజుకూలీ కూడా లభిస్తుంది. ప్రభుత్వ

> చేనేత పరిశ్రమ ముఖ్యముగా 124 లక్షల మందికి ఉపాధి కల్పిస్తుంది. ఇది వ్యవసాయం తరువాత అతి పెద్ద రంగం. ఈ ఉపాధిలో, 60 శాతం స్త్రీలు, 12 శాతం ఎస్.సిలు, 20 శాతం ఎస్.టిలు, ఉన్నారు - కేంద్ర జౌళి శాఖ, 2001

నివేదికల్లో తరచూ రాస్తున్నట్టు చేనేతలో వినియోగమయ్యేది ముతక శ్రమ కాదు. ప్రత్యేక నైపుణ్యం అక్కర లేని పనులు కూడా కొన్ని ఉన్నా శరీర కష్టం, సాధన వాటికి ఎంతో అవసరం. వ్యవసాయంనుంచి ఇతర రంగాలనుంచి అంతర్‌వలసల ద్వారా తరలివచ్చే శ్రామిక బలగం ఇటువంటి పనుల్లో అధికాధికంగా పాల్గొంటోంది. ప్రధాన చేనేత కేంద్రాల్లో ఈ పనులకు అధిక డిమాండు ఏర్పడింది. స్వయం ఉపాధికి దినసరి వేతనానికి వ్యవసాయరంగం తర్వాత అతిపెద్ద వనరుగా చేనేత రంగం కొనసాగుతున్నదనే వాస్తవాన్ని ప్రభుత్వం విస్మరిస్తోంది. కనీసం నాలుగు లక్షల ఉద్యోగాలనిచ్చే శక్తి చేనేత రంగానికి ఉందని ప్రణాళికా సంఘం ఇటీవల నియమించిన 'కోటి ఉద్యోగాల టాస్క్‌ఫోర్స్' స్వయంగా చెబుతున్నా ఈ రంగం మనుగడను ప్రశ్నార్థకం చేసే విధానాలను ప్రభుత్వం అనుసరించడం మనకు అర్థం కాని విషయం.

పరిశోధకులు, విధాన నిర్ణేతలు భావిస్తున్నదానికంటే పెద్దది ఈ దేశంలోని నిరుద్యోగ సమస్య. 1977-78, 1993-94 మధ్య కాలంలో 63.9 కోట్లనుంచి 90.3 కోట్లకు దేశ జనాభా పెరిగిపోయింది. అదేసమయంలో దేశ శ్రామిక బలగం 27.6 కోట్లనుంచి 38.5 కోట్లకు పెరిగింది. జనాభా వార్షిక పెరుగుదల రేటు 2.2శాతం కాగా శ్రామిక బలగం వృద్ధిరేటు 2.1శాతంగా ఉంది. శ్రామిక బలగం పెరిగిన రీతిలో ఉపాధి అవకాశాలు కూడా పెరిగాయని పైకి అనిపించినా సాధారణ ఉపాధి అవకాశాలు సన్నగిల్లుతున్నాయన్న వాస్తవాన్ని ఈ అంకెలు దాస్తున్నాయి. ఉపాధి నాణ్యతలో వచ్చిన మార్పులను గమనిస్తే ఈ వాస్తవాన్ని వివరించే ఆధారాలు లభ్యమవుతాయి. ఉపాధి నాణ్యతకు ప్రధాన సూచిక ఉపాధికుండే స్థాయి. అధిక నాణ్యత గల ఉపాధి అవకాశాలకు ప్రాముఖ్యం తగ్గుతూ అల్ప నాణ్యత ఉండే పనులకు ప్రాముఖ్యం హెచ్చడమనే స్థూల ధోరణి ఈ మార్పుల్లో వ్యక్తమవుతోంది.

మిగులు శ్రామిక శక్తికి ఎప్పుడూ వ్యవసాయమే ముఖ్య రిజర్వాయరు. అదికూడా ముతక ఉపాధి విషయంలోనే. శ్రామిక శక్తి ఒక రంగంనుంచి మరోరంగానికి బదిలీ అవుతున్న కారణంగా ఇతర రంగాల్లో కూడా మిగులు ఏర్పడింది. పరిశ్రమల్లో దినసరి వేతనం, సేవల రంగంలో స్వయం ఉపాధి పెరుగుతున్నాయి.

దేశంలో నిరుద్యోగం పెరుగుతున్నదనే విషయాన్ని ఇప్పటికే అనేక నివేదికలు ధృవీకరించాయి. కోటి ఉద్యోగాల టాస్క్‌ఫోర్స్, ఉపాధి అవకాశాల టాస్క్‌ఫోర్స్(ప్రణాళికా సంఘం), మెకిన్సీ రిపోర్టు, 2001 జనాభా గణాంకాలు, ఉపాధి మారకాలకు సంబంధించిన సమాచారం, 1978నాటి ఆర్థిక గణాంకాలు ఇందుకు ఉదాహరణలు.

ఉపాధి కల్పనను అతిప్రధానమైన కర్తవ్యంగా చేపడితే తప్ప దేశంలోని నిరుద్యోగుల సంఖ్య 10వ పంచవర్ష ప్రణాళికాంతానికి 4 కోట్లకు చేరుతుందని 'కోటి ఉద్యోగాల టాస్క్‌ఫోర్స్' హెచ్చరించింది. నాలుగు కోట్లంటే శ్రామిక బలగం పరిమాణంలో పదిశాతమన్నమాట. జనాభాలోని కొన్ని తరగతులను, కొన్ని రంగాలను ఎంతో లోతైన ఆర్థిక సామాజిక పర్యవసానాలకు గురి చేసే అంశమిది.

మొత్తం 9,977.92 కోట్ల రూపాయల పెట్టుబడి ద్వారా 8,96,409 మందికి ఉపాధి కల్పించినట్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చెప్పుకుంటోంది. అంటే ఉపాధి కల్పించినట్టు చెబుతున్న ప్రతి వ్యక్తి పై 1, 11, 309 రూపాయలు వెచ్చించినట్టు లెక్క. ఉపాధి కార్యక్రమాలన్నీ అవినీతి కూపాలుగా మారాయని, నిర్దేశిత లక్ష్యం పది శాతం కూడా నెరవేరడం లేదనే విషయం అందరికీ తెలుసు. అయినప్పటికీ ఇలాంటి కార్యక్రమాలపైన పెద్ద ఎత్తున నిధులు వెచ్చించడానికి ప్రభుత్వాలు ముందుకు రావడం వెనుక స్వార్థ ప్రయోజనాలు ఉన్నాయన్నది స్పష్టం. ఇది చాలదన్నట్టు నిరుద్యోగాన్ని పెంచి పోషించే విధానాలను కూడా అమలు జరుపుతున్నారు.

ఆర్థికాభివృద్ధి ప్రక్రియలో ఉద్యోగ కల్పనా సామర్థ్యం సన్నగిల్లిన కారణంగానే నిరుద్యోగ సమస్య తీవ్రమైందని టాస్క్‌ఫోర్స్ చెప్పింది. టాస్క్‌ఫోర్స్ సూచిస్తున్న ఈ ధోరణి 1993-94నుంచి కనబడుతోంది. 1983-84, 1993-94 మధ్యకాలంలో 2,7శాతం వార్షిక వృద్ధి రేటుతో సాగిన ఉపాధి పెరుగుదల 1993-94, 1999-2000 మధ్యకాలంలో 1.07శాతానికి కుంగింది. 5.2శాతంగా ఉన్న స్థూల జాతీయోత్పత్తి(జిడిపి) 6.7 శాతానికి పెరిగినప్పటికీ ఉపాధి అవకాశాల రేటు తగ్గడం ఇక్కడ గమనించవలసిన విషయం. ప్రతి యూనిట్ ఉత్పత్తిపై మూడురెట్ల ఉద్యోగ సామర్థ్యం తగ్గిపోయిందని అర్థం.

సంఘటిత రంగంలో ఉద్యోగ అవకాశాల పెరుగుదల దాదాపు శూన్యం. ప్రభుత్వ రంగంలో నెగిటివ్ వృద్ధి సర్వసాధారణమైపోయింది. ‘ పెరుగుతున్న మార్కెట్ పోటీని తట్టుకునే పేరుతో మిగులు శ్రమను వదిలించుకోవడంతోపాటు, శ్రమశక్తి వినియోగంకంటే పెట్టుబడి వినియోగం ఎక్కువుండే రంగాల దిశగా అభివృద్ధి సాగుతున్నది. పై పరిస్థితి వీటి పుణ్యమే ’ నని టాస్క్‌ఫోర్స్ తేల్చి చెప్పింది. పని చేసే మనుషులకు అవసరమైనన్ని యంత్రాలు అందుబాటులో లేవనే భావనకు అనుగుణంగా గతంలో అభివృద్ధి ప్రణాళికలు రచించినట్టు అజిత్ కె.ఘోష్ చెబుతారు. యంత్రాలు ప్రధాన ఉత్పాదక శక్తిగా ఉండే పరిశ్రమలకు ఇప్పుడు లభిస్తున్న ప్రాముఖ్యత వెనుక ఉద్దేశమే వేరు. ఆధునిక పారిశ్రామిక వ్యవస్థలో ఉపాధి అవకాశాలు చాలా నెమ్మదిగా పెరుగుతాయని, నిరుద్యోగ సమస్యను పరిష్కరించే విషయంలో ఈ రంగం చేయగలిగింది చాలా తక్కువని దీన్నిబట్టి మనకు అర్థమవుతుంది. వినియోగదారీ సరుకుల డిమాండును తీర్చడానికి శ్రమశక్తి వినియోగం అధికంగా ఉండే సంప్రదాయ, ఆధునిక చిన్నతరహా పరిశ్రమలపై ఆధారపడాలనే ఆలోచన ఈ వాస్తవికతలోనుంచి పుట్టుకువచ్చింది. సంప్రదాయ పరిశ్రమలకు చేయూతనివ్వడం, చిన్నతరహా పరిశ్రమలకు ఉత్పత్తులు రిజర్వు చేయడం వంటి చర్యలు ఈ రంగాల అభివృద్ధికి అనుసరించవలసిన స్థూల వ్యూహంలో అంతర్భాగాలు కావాలి. అయితే ఈ విధానాలను ప్రభుత్వాలు సరిగా అమలు పర్చిన దాఖలాలు లేవు.

పాత విధానాలు సఫలీకృతం కాకపోవడమనే మాట పక్కన పెడితే నిరుద్యోగ సమస్య, అత్తెసరు ఉపాధి అన్న జోడు సమస్యలు రెండవ పంచవర్ష ప్రణాళికను రూపొందించేటపుడు అప్పటి ఆర్థికవేత్త మహలనోబిస్‌ను ఎంతగా కలవరపర్చాయో ప్రస్తుత ప్రణాళికా వ్యూహకర్తలనూ అంతే ఆందోళనకు గురి చేస్తున్నాయి. ఎగుమతి ప్రధానమైన పారిశ్రామికీకరణంతో ఈ సమస్యను పరిష్కరించవచ్చునని ఈనాటి పాలకులు భావిస్తున్నారు. ఉపాధి అవకాశాలు ఎక్కువుండే ఉత్పాదక రంగాల అభివృద్ధికి ఈ చర్య దోహదపడుతుందన్నది వారి అభిప్రాయం. అటు సమస్యల గురించిన సరైన అవగాహన కానీ, ఇటు ఆ సమస్యల పరిష్కారంలో తమ వ్యూహం ఎంతవరకు ఉపయోగపడుతుందన్న అంచనా కానీ వీరికి లేవు.

నిరుద్యోగుల్లో విద్యార్థికులకు, నిపుణులకు ఉద్యోగాలు దొరకడం కష్టమైపోయింది. ఈ తరగతుల వారిలో నిరుద్యోగం దాదాపు 25శాతానికి చేరుకుంది (జాతీయ సగటు నిరుద్యోగ రేటుకంటే ఇది మూడింతలు అధికం). వీరికి కొన్ని రంగాల్లో కొరత కూడా ఉంది. మన చదువులు, నైపుణ్య శిక్షణలు సంఘటిత రంగ అవసరాలు తీర్చడానికే పరిమితమైనందువల్ల ఈ పరిస్థితి దాపురించింది. ఈ పరిస్థితి మరెంతో కాలం సాగదు. సంఘటిత రంగంలో అదనపు ఉపాధి అవకాశాల సామర్థ్యం సన్నగిల్లి పోయిన నేపథ్యంలో వ్యవసాయం, చిన్న పరిశ్రమలు, సేవలు, స్వయం ఉపాధి వంటి అసంఘటిత రంగాల అవసరాలు తీర్చే విధంగా విద్యావిధానాన్ని, నైపుణ్య శిక్షణలను మలచుకోవలసి ఉంటుంది.

1999-2000 సంవత్సరంలో అందుబాటులోకి వచ్చిన ఉపాధి అవకాశాల్లో 92 శాతం మేరకు అసంఘటిత రంగంనుంచి వచ్చాయనే వాస్తవాన్ని టాస్క్‌ఫోర్స్ గుర్తించింది. సర్వీసు రంగాల్లో ఎక్కువగా వేళ్ళూనుకున్న అసంఘటిత ఉపాధిని ప్రధాన లక్ష్యంగా ఎంచుకుని ప్రణాళికలు రచించాలని టాస్క్‌ఫోర్స్ స్పష్టం చేసింది.

స్థూల జాతీయోత్పత్తిలో 59శాతం, ఉపాధి అవకాశాల్లో 92శాతం, ఎగుమతుల్లో గణనీయమైన శాతం అసంఘటిత రంగంనుంచే సమకూరుతోంది. మాన్యుఫ్యాక్చరింగ్ విషయానికి వస్తే, సంఘటిత రంగంకంటే అసంఘటిత రంగంలోనే 2నుంచి 3శాతం అధిక పెరుగుదల నమోదవుతోంది. అయితే డీరెగ్యులేషన్, సబ్సిడీల ఉపసంహరణ వంటి నిర్ణయాలవల్ల అసంఘటిత రంగం ఖాయిలా పరిస్థితిని ఎదుర్కోవలసి వస్తోంది. పరిమాణాత్మక ఆంక్షల ఎత్తివేత, టారిఫ్ తగ్గింపు కారణంగా అసంఘటిత రంగానికి చెందిన ఉత్పత్తులు మార్కెట్ పోటీలో నిలుదొక్కుకోలేని పరిస్థితి నెలకొన్నది.

అసంఘటిత ర ంగాన్ని పటిష్టపర్చడంలోనూ ఉపాధి అవకాశాల ముఖ్యవనరుగా ఉన్న చేనేతను ఉద్ధరించడంలోనూ ప్రభుత్వాలు విఫలమయ్యాయి. పరిశ్రమలలో అధిక ఉత్పాదన, నాణ్యతలను సాధించగల కార్యక్రమాలు అమలుపర్చితేనే మారిన పరిస్థితుల్లో ఈ రంగం నిలదొక్కుకోగలుగుతుందనే వాస్తవాన్ని కేంద్ర ప్రభుత్వం పూర్తి

స్థాయిలో గుర్తించిన దాఖలాలు కనిపించడం లేదు. టెక్స్‌టైల్స్ భవితవ్యంపై నియమించిన పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ తన 48వ నివేదికలో ఇలా పేర్కొన్నది: 'లక్షలాది చేనేతకారులకు ఈ రంగం ఉపాధి కల్పించింది. చేనేత అనుబంధ కార్యకలాపాలనుంచి 65 లక్షల మంది వ్యక్తులు ప్రత్యక్ష ఉపాధిని పొందుతున్నారు. ఉన్ని, సిల్కు, వడికిన నూలు ఉత్పాదనను పక్కన పెట్టి చూసినా దేశంలో ఉత్పత్తి అవుతున్న మొత్తం వస్త్రాల్లో 19 శాతం చేనేత రంగంనుంచి లభ్యమవుతోంది. 1999-2000 సంవత్సరంలో 735.2 కోట్ల చదరపు మీటర్ల వస్త్రాన్ని ఈరంగం ఉత్పత్తి చేసింది.'

ప్రైవేటు సంఘటిత రంగానికి భారీగా పెట్టుబడులు రావడంతో అసంఘటిత రంగానికి వచ్చే పెట్టుబడి పరిమాణం వేగంగా తగ్గిపోతోంది. ఈ కారణంగానే శ్రమశక్తి అధికంగా అవసరమయ్యే పరిశ్రమలకు అనువుగా పెట్టుబడి కేటాయింపులు పునర్విభజించాలని కోటి ఉద్యోగాల టాస్క్‌ఫోర్స్ సూచించింది. అదే సమయంలో సంఘటిత రంగంలో వీలైనంత మేరకు పెట్టుబడిని ఆదా చేయాలని, అలా చేస్తే ఆర్థికాభివృద్ధి ఇనుమడిస్తుందని కమిటీ పేర్కొన్నది.

ఈ పరిస్థితుల్లో అసంఘటిత రంగ విస్తరణకు నడుం కట్టడమనేది ఉపాధి కల్పనలో భవిష్యత్ వ్యూహం కావాలి. అభివృద్ధి చెందిన దేశాలను తీసుకున్నా అక్కడి ఉపాధి అవకాశాలకు అసంఘటిత రంగంనుంచి సమకూరుతున్న వాటా తక్కువేమీ కాదు.

'కోటి ఉద్యోగాల టాస్క్ ఫోర్స్' ఇలా పేర్కొన్నది: 'శ్రమశక్తి ఎక్కువగా అవసరమయ్యే , పెట్టుబడిని ఆదా చేయగలిగే టెక్నాలజీని ప్రోత్సహించడం, అసంఘటిత రంగంలో పెరుగుదలను ప్రోత్సహించడమన్నవి పంచవర్ష ప్రణాళిక ఉపాధి లక్ష్యాలుగా ఉండాలి.'

నిరుద్యోగులకు పని కల్పించే పేరుతో ఉపాధి కల్పనా కార్యక్రమాలపైన, భారీ పరిశ్రమలపైన పెద్ద ఎత్తున ప్రభుత్వాలు డబ్బు ఖర్చు చేస్తున్నాయి. వేతన, స్వయం ఉపాధి కార్యక్రమాలపై గ్రామీణ, పట్టణ ప్రాంతాలు కలిపి 1990-91 సంవత్సరంలో 4121.33 కోట్ల రూపాయలు వెచ్చించగా 1999-2000 సంవత్సరానికి అదికాస్త 8627.63 కోట్ల రూపాయలకు పెరిగింది. మొత్తం 9,977.92 కోట్ల రూపాయల పెట్టుబడి ద్వారా 8,9 6,409 మందికి ఉపాధి కల్పించినట్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చెప్పుకుంటోంది. అంటే ఉపాధి కల్పించినట్టు చెబుతున్న ప్రతి వ్యక్తి పై 1, 11, 309 రూపాయలు వెచ్చించినట్టు లెక్క. ఉపాధి కార్యక్రమాలన్నీ అవినీతి కూపాలుగా మారాయని, నిర్దేశిత లక్ష్యం పది శాతం కూడా నెరవేరడం లేదనే విషయం అందరికీ తెలుసు. అయినప్పటికీ ఇలాంటి కార్యక్రమాలపైన పెద్ద ఎత్తున నిధులు వెచ్చించడానికి ప్రభుత్వాలు ముందుకు రావడం వెనుక స్వార్థ ప్రయోజనాలు ఉన్నాయన్నది స్పష్టం. ఇది చాలదన్నట్టు నిరుద్యోగాన్ని పెంచి పోషించే విధానాలను కూడా అమలు జరుపుతున్నారు.

---

# ఇటీవలి కార్యక్రమాలు

## చిప్ కార్యాలయం ప్రారంభం

రామకష్ణాపురం(చీరాల)లో ఏర్పాటు చేసిన చిప్ కార్యాలయాన్ని దక్షిణాఫ్రికాలో భారత మాజీ హైకమిషనర్, ప్రణాళికా సంఘం మాజీ సభ్యుడు శ్రీ ఎల్.సి.జైన్ ఫిబ్రవరి 17న లాంఛనంగా ప్రారంభించారు.

## చేనేతకార్మికుల సదస్సు

చీరాలలో అదేరోజు చేనేత కార్మికుల సదస్సును చిప్ నిర్వహించింది. రాష్ట్రంనలుమూలలనుంచి వచ్చిన చేనేత కార్మికులు ఈ సదస్సులో పాల్గొన్నారు.

ఈ కార్యక్రమానికి ఆంధ్రప్రదేశ్ సైన్స్ అండ్ టెక్నాలజీ మండలి సీనియర్ అధికారి డాక్టర్ పి.వి.సుబ్బారావు, డాక్టర్ నరేష్ శర్మ(సెంట్రల్ యూనివర్సిటీ), శ్రీ నిషాంత్ పాండే(ఆక్స్‌ఫాం, జిబి), శ్రీ ఎల్.కణ్ణన్(పిపిఎస్‌టి ఫౌండేషన్), శ్రీ మాచర్ల రామ్మోహన్‌రావు(రాష్ట్రీయ చేనేత

కార్మిక సమాఖ్య) హాజరయ్యారు. వివిధ జిల్లాలనుంచి వచ్చిన ప్రతినిధులు తామెదుర్కొంటున్న సమస్యలను వివరించారు. సమస్యల్లో అధికభాగం ప్రభుత్వ అసమర్థత, అవినీతి, తప్పుడు విధానాలనుంచి పుట్టుకు వచ్చినవే. ప్రభుత్వ విధానాలపైన చేనేత రంగ భవిత్యవంపైన సమగ్ర సమాచారాన్ని ఇవ్వాలని చిప్ నిర్వాహకులకు ప్రతినిధులు సూచించారు. చేనేత రంగ సామర్థ్యాన్ని, స్థోమతను ఇనుమడించే మరిన్ని కార్యక్రమాలు చేపట్టవలసిన అవసరం ఉందని వారు అభిప్రాయపడుతున్నారు.

## రాబోయే కార్యక్రమాలు

**పత్తి జిన్నింగ్, ప్రెస్సింగ్ ఫాక్టరీల ఆధునీకరణపై వర్క్‌షాప్**

పత్తి జిన్నింగ్, ప్రెస్సింగ్ ఫ్యాక్టరీల ఆధునీకరణపై ఏప్రిల్ 4న వరంగల్‌లో వర్క్‌షాప్ ఏర్పాటు చేస్తున్నట్టు కేంద్ర టెక్స్‌టైల్స్ మంత్రిత్వ శాఖ ఆధ్వర్యంలోని పత్తి టెక్నాలజీ మిషన్(టిఎంసి), టెక్స్‌టైల్స్ కమిటీలు ప్రకటించాయి. ఫ్యాక్టరీలకు సంబంధించిన గణాంక వివరాలు సేకరించిన మీదట ఈ కార్యక్రమాన్ని ప్రభుత్వం ఏర్పాటు చేస్తోంది. దేశంలో 4015 ఫ్యాక్టరీలు 12 రాష్ట్రాల్లో విస్తరించి ఉన్నాయి. 2001-02 సంవత్సరంలో ఈ సర్వే నిర్వహించారు. ఈ ఫ్యాక్టరీలను వీలైనంత త్వరగా ఆధునీకరించాలని సర్వే నివేదిక సూచించింది.

---

## చేనేతకు తగ్గిన బడ్జెట్ కేటాయింపులు

గడచిన పలు సంవత్సరాలుగా చేనేత రంగంపై బడ్జెట్ కేటాయింపులను కేంద్ర ప్రభుత్వం వరుసగా తగ్గించుకుంటూ వస్తోంది. ఈ ధోరణి గత ఐదేళ్ళ కాలంలో కళ్ళకు కట్టినట్టు కనబడుతుంది. చేనేత రంగానికి చేసిన కేటాయింపుల్లో చేనేతకారులకు ప్రత్యక్షంగా మేలు చేకూర్చే పథకాల పద్దులను మరింత కుదించారు. గడచిన ఆరేళ్ళలో బడ్జెట్ కేటాయింపులు ఎలా తగ్గుతూ వస్తున్నదీ ఈ కింది పట్టిక చూస్తే తెలుస్తుంది. మగ్గాలు మెరుగుపర్చుకోవడమన్నది ఇంతవరకు జరగలేదు. అయితే టెక్స్‌టైల్స్ శాఖకు నిధుల కేటాయింపు పెరుగుతూ వస్తోంది. ఇదెంతో ఆసక్తిదాయకమైన విషయం. జౌళి శాఖకు 1997-98, 2002-03 మధ్య కాలంలో కేటాయింపులు దాదాపు రెట్టింపయ్యాయి. జనతావస్త్రంపై సబ్సిడీ ఉపసంహరించినందువల్ల 1999-00 సంవత్సరంలో భారీగా బడ్జెట్ తగ్గింది. ప్రణాళికేతర కేటాయింపులు మాత్రం

| Budget Allocations: Union Ministry of Textiles (in Rs. Crores) | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| Year | Handloom Budget | | | Total Budget | | | % of total |
| | Plan | NPlan | Total | Plan | N-Plan | Total | |
| 1997-98 | 107.00 | 96.50 | 203.50 | 260.00 | 479.04 | 739.04 | 27.5 |
| 1998-99 | 89.80 | 61.80 | 151.60 | 260.00 | 726.58 | 986.58 | 15.3 |
| 1999-00 | 81.80 | 56.50 | 138.30 | 266.00 | 740.10 | 1006.10 | 13.7 |
| 2000-01 | 112.00 | 53.29 | 165.29 | 457.00 | 754.30 | 1211.30 | 13.6 |
| 2001-02 | 116.00 | 40.50 | 156.50 | 650.00 | 660.30 | 1310.30 | 11.9 |
| 2002-03 | 117.00 | 35.83 | 152.83 | 715.00 | 870.50 | 1585.50 | 9.63 |

జనతా వస్త్రంపై సబ్సిడీ ఉపసంహరించారు. దీన్‌దయాళ్ ప్రోత్సాహన్ యోజన అనే కొత్త పథకాన్ని ప్రవేశపెట్టినప్పటికీ కేటాయింపులు మాత్రం తగ్గిపోయాయి. మరమగ్గాల ఆధునీకరణ, పునరుద్ధరణకోసం ఏకంగా మూడు కేంద్ర ప్రయోజిత పథకాలు ప్రవేశపెట్టారు. ఈ పథకాల ఫలితాలను ఇంకా మదింపు వేయవలసి ఉంది. యంత్రాలు సమకూర్చడమే ఆధునీకరణ అని అధికారులు భ్రమిస్తారు. అదే రీతిలో బడ్జెట్‌ను కేటాయిస్తారు. కేవలం ప్రభుత్వ తోడ్పాటుపై ఆధారపడి పెరుగుతున్నాయి. గ్రామీణ వ్యవసాయం తర్వాత ఉపాధికల్పనలో చేనేత రంగానిదే ప్రధాన వాటా అని ప్రణాళికా సంఘం చెబుతున్నప్పటికీ ప్రణాళికా కేటాయింపులు ఎందుకు తగ్గిస్తున్నారనేది ఎవరికీ అర్థం కావడంలేదు. చేనేత రంగానికి నిజంగా ఉపయోగపడే పథకాలను ప్రణాళికలో చేర్చడమన్నది ఇప్పటివరకు జరగలేదు. కనీసం 10వ పంచవర్ష ప్రణాళికలోనయినా ఆ పని చేస్తారేమో చూడాలి.

| Revised Budget in Rs. crores | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| Year | Handloom Revised | | | Total Revised | | | % of Total |
| | Plan | N-Plan | Total | Plan | N-Plan | Total | |
| 1997-98 | 96.39 | 78.37 | 174.76 | 250.00 | 842.26 | 1092.26 | 15.9 |
| 1998-99 | 80.72 | 58.06 | 138.78 | 240.88 | 766.62 | 1007.50 | 13.7 |
| 1999-00 | 78.25 | 46.92 | 125.17 | 260.45 | 817.27 | 1077.72 | 11.6 |
| 2000-01 | 85.00 | 45.65 | 130.65 | 408.30 | 818.82 | 1227.12 | 10.6 |
| 2001-02 | 95.77 | 30.67 | 126.44 | 610.00 | 816.33 | 1426.33 | 8.86 |

మరోవైపు పవర్‌లూంలకు, ఇతర పథకాలకు బడ్జెట్ పెంచుకుంటూ పోతున్నారు. ఆమేరకు చేనేతపై టెక్స్‌టైల్స్ మంత్రిత్వ శాఖ శీతకన్ను వేసినట్టే. వేదికలపై చేసే ఉపన్యాసాలకూ బడ్జెట్ కేటాయింపులకూ పొంతన లేని పరిస్థితి కొనసాగుతున్నది. బడ్జెట్ కేటాయింపులు తగ్గించడం ద్వారా, పవర్‌లూంలకు ప్రాధాన్యం పెంచడం ద్వారా చేనేత రంగాన్ని బలహీనపర్చే కార్యక్రమం అవిచ్ఛిన్నంగా సాగిపోతోంది.

ఇప్పుడున్న పథకాలన్నీ సహకార సంఘాల్లోని చేనేత కార్మికులకు ఉద్దేశించినవే కనుక చేనేత కుటుంబాలన్నీ సహకార సంస్థల్లో సమీకృతమయ్యేలా టెక్స్‌టైల్స్ మంత్రిత్వ శాఖ వ్యూహరచన చేయాలని పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ పనిగట్టుకుని చెప్పవలసి వచ్చిందంటే పాలకుల వైఖరి ఎలా ఉందో అర్థం చేసుకోవచ్చు.




'పై కృషిని మరింత ముందుకు తీసుకెళ్ళడంలో భాగంగా వర్క్‌షెడ్ కం హౌజింగ్ పథకాన్ని విస్తృతంగా అమలు జరపాలని, పట్టణాలకు సమీపంలో నివసించే చేనేతకార్మికులందరికీ ఈ పథకం అందుబాటులోకి వచ్చేలా నిధులు పెంచాలి. సహకార గృహనిర్మాణాన్ని కూడా ప్రోత్సహించాలి.'

చేనేతకు అదే పనిగా నిధులు తగ్గిపోతున్నాయని మనం చెబుతుంటే అరకొర కేటాయింపులను కూడా ప్రభుత్వం సవ్యంగా వినియోగించడం లేదని సవరించిన అంచనాల తీరు స్పష్టం చేస్తోంది. సవరించిన అంచనాల్లో 10నుంచి 20శాతం తగ్గుదల తప్పనిసరిగా ఉంటున్నది. ఈ విధంగా ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం నిధులు తగ్గుతున్నాయి. 1997-98 బడ్జెట్‌లో 27.5శాతం కేటాయింపులు చేసి తీరా 15.9శాతానికి సవరించారు. ఇదే ధోరణి తర్వాత కూడా కొనసాగింది. అవినీతి, బోగస్ క్లెయిములు, అడ్డగోలు ఖర్చులు లెక్కలోకి తీసుకున్నట్టయితే అరకొర కేటాయింపులవల్ల చేనేతకార్మికులకు ఒరుగుతున్నది శూన్యం.

స్థూలంగా చూస్తే, ప్రపంచబ్యాంకు షరతులు, సత్యం కమిటీ సిఫార్సులను ప్రభుత్వం అనుసరిస్తున్నట్టు కనబడుతోంది. చేనేత రంగాన్ని ఆధునీకరించాలన్న ప్రభుత్వ తహతహను గమనిస్తుంటే ఈ రంగాన్ని భూస్థాపితం చేసే కార్యక్రమానికి త్వరలోనే శ్రీకారం చుడుతుందేమో అనిపిస్తున్నది. చేనేత రంగాన్ని బాగుపర్చే ఉద్దేశం ప్రభుత్వానికి ఏ కోశానా లేదనే విషయం బడ్జెట్ కేటాయింపులు చూస్తే ఇట్టే తెలిసిపోతుంది. మరో ఆసక్తికరమైన విషయమేమంటే పన్నులు వేయని కాలంలోనే ఈరంగానికి బడ్జెట్ కేటాయింపులు అధికంగా ఉన్నాయి.

2003-04 బడ్జెట్‌లో కండెనూలుపై పన్నులు

ప్రతిపాదించారు. ఈ రంగంనుంచి ఆదాయం రాబట్టుకునేందుకు మరికొన్ని చర్యలను కూడా అందులో ప్రకటించారు. ఆపైన కేటాయింపులు తగ్గించారు. చూడబోతే పన్నులు వేసే అధికారం మాత్రమే ఉంచుకుని ఈ రంగంపట్ల తనకున్న సామాజిక ఆర్థిక బాధ్యతలను గాలికి వదిలివేయాలన్నది ప్రభుత్వ ఉద్దేశంగా కనబడుతున్నది. ఇది సామాజిక న్యాయాన్ని, సమానత్వ సూత్రాన్ని తిరగదోడే చర్య.

--------------

## చరిత్రలో చేనేత

తుమ్కూరు జిల్లా గురించి 1969లో మైసూర్ స్టేట్ గెజిటీర్‌లో పొందుపర్చిన వివరాలు:

జిల్లాలోని గ్రామీణ ప్రాంతాల్లో అనేక కుటుంబాలు చేనేత వృత్తిని ప్రధాన వ్యాపకంగా ఎంచుకున్నాయి. జిల్లాలో 9,000 రిజిస్టర్డు చేనేత మగ్గాలు ఉండగా పత్తి వస్త్రాల తయారీలో 33శాతం, పట్టువస్త్రాల తయారీలో 25శాతం, ఉన్ని దుస్తుల తయారీలో 42శాతం మగ్గాలు పని చేస్తున్నాయి. పత్తి వస్త్రాల తయారీలో 1,700 కుంటుంబాలకు పూర్తికాలం, 5000 కుటుంబాలకు పాక్షికంగా ఉపాధి లభిస్తోంది. 80శాతం మగ్గాలు సహకార సంఘాల పరిధిలో పని చేస్తున్నాయి. జిల్లాలోని కుటీర పరిశ్రమల ఉత్పత్తుల్లో 50శాతం, గ్రామీణ ఉత్పాదనలో సగం చేనేత రంగంనుంచే వస్తోంది. జిల్లా అంతటా చేనేత రంగం విస్తరించినప్పటికీ ప్రధానంగా టిప్టూర్ తాలూకాలోని హాలెపల్లె, గుబ్బి తాలూకాలోని గుబ్బి, కల్లూరు, సోమల్‌పురా, తురువుకేరి తాలూకాలోని మావినకేరి, పావగడ తాలూకాలోని వై.ఎన్.హోస్కోట్, గంగసాగర్ ప్రాంతాల్లో కేంద్రీకృతమై ఉంది. దేవాంగ కులానికి చెందిన మూడువేల కుటుంబాలు ఈ వృత్తిలో కొనసాగుతున్నాయి. జిల్లాలో 1964లో 3170 రిజిస్టర్డు పత్తి మగ్గాలు ఉండేవి. అందులో 2416 మగ్గాలు సహకార రంగానివి. 20, 30, 40 కౌంట్ చీరలు, చద్దర్లు, బెడ్‌షీట్లు , ధోవతులు ప్రధానంగా తయారు చేస్తారు. తక్కువ కౌంటు చీరలను 80శాతం మేర ఉత్పత్తి చేసేవారు. కాటన్ గళ్ళకు తురువుకేరి పెట్టింది పేరు. చేనేత పరిశ్రమకు కావలసిన పత్తి నూలు, పట్టు, జరీ, రంగులు, రసాయనాలు బెంగుళూరునుంచి తెప్పిస్తారు. దాదాపు 25-30శాతం చేనేత అవసరాలను బెంగుళూరులోని అపెక్స్ కాటన్ హ్యాండ్ లూం సొసైటీ తీర్చుతుంది. మిగతా ముడిసరుకును నేరుగా మార్కెట్‌లో కొనుగోలు చేస్తారు. జిల్లాలోని పత్తి మగ్గాల యజమానులు ఏటా 12 లక్షల రూపాయల విలువైన ముడిసరుకును కొనుగోలు చేస్తారు. 1967లో 18 పత్తి చేనేత సహకార సంఘాలు పని చేసేవి. వాటిలో 2, 757 మంది సభ్యులు ఉండేవారు. వారు మదుపు చేసిన మూల ధనం 47వే ల రూపాయలు.

--------------

## చేనేత కార్మికుల వ్యధలు

ఆదిలక్ష్మి, మునగాల వెంకట సుబ్బయ్య దంపతులది ప్రకాశం జిల్లాలో కొత్తపట్నం మండలంలోని ఈతముక్కల గ్రామం. చేనేత పరిశ్రమలో ఈ గ్రామానికి పెద్ద పేరుంది. సుబ్బయ్య దంపతులకు ఇద్దరు సంతానం. 25 అడుగుల సాధారణ వస్త్రాన్ని నేయడానికి ఐదురోజుల్లో రోజుకు పన్నెండు గంటల చొప్పున వెంకటసుబ్బయ్య శ్రమిస్తాడు. నేతకు ముందు కూడా రెండు రోజుల పని. అంతా కలిపితే ఆయనకు వచ్చేది 280 రూపాయలు. అంటే నెలకు 1020 రూపాయల సంపాదన. రోజుకు 34 రూపాయల కూలీ.

కుటుంబ అవసరాలకు ఈ సంపాదన సరిపోదు. సరళీకరణ, ఆర్థిక సంస్కరణలు వచ్చాక వారి జీవితం మరింత దుర్భరంగా మారింది. చేనేత రంగానికి పవర్‌లూంలు, మిల్లులనుంచి పోటీ అధికమైంది. ఈ పరిస్థితుల్లో ఆదిలక్ష్మి వ్యవసాయ కూలీగా మారింది. కూలీపని దొరికిన రోజున 25 రూపాయలు ఆమె సంపాదిస్తుంది. అప్పటికీ వారి పిల్లల పోషణ కష్టంగానే ఉంది. బిడ్డల కడుపు నింపడంకోసం రాత్రుళ్లు పస్తులు ఉంటోందామె. ఈ విషయం కనిపెట్టిన పెద్ద కొడుకు ఆ తర్వాత స్కూలుకు వెళ్ళడం మానేశాడు. అదే పనిగా పస్తులుండటంతో ఆదిలక్ష్మి ఆరోగ్యం క్షీణించింది. అప్పటికిగాని తన భార్య చేసిన త్యాగమేమిటో వెంకటసుబ్బయ్యకు అర్థం కాలేదు. పోషకాహారం లభించక మూడోబిడ్డ అనారోగ్యంపాలయ్యాడు. ఈ పరిస్థితి ఆదిలక్ష్మి కుటుంబానికి మరింత భారంగా పరిణమించింది. కూలీపని దొరకనపుడు వారి కష్టాలు వర్ణనాతీతం.

విధిలేని పరిస్థితుల్లో వెంకటసుబ్బయ్య కుటుంబం చీరాలకు

వలస వెళ్ళింది. పన్నెండేళ్ళ పెద్ద కొడుకు 400 రూపాయలకు ఒక హార్డ్ వేర్ షాపులో పనికి కుదిరాడు. కొడుకు సంపాదన అప్పులు తీర్చడానికి సరిపోయేది . మిగిలిన 1500 రూపాయల్లో రెండువందలు ఇంటి అద్దెకు, నూటాయాభై కరెంటు బిల్లుకు, మరో యాభై రూపాయలు పాత బాకీకింద చెల్లించేవారు. ఆహారం, బట్టలు, ఇతర కుటుంబ అవసరాలకు డబ్బు చాలేది కాదు. ఆహారం సరిగా లేనపుడు ఆనారోగ్యం తప్పదు. సరళీకరణ విధానాల కారణంగా ఆ కాస్త ఆదాయాన్ని కూడా వారిపుడు కోల్పోయారు.  చేనేత కార్మికుల జీవితాల్లో ప్రభుత్వ విధానాలు సృష్టించిన సంక్షోభమిది.  పెద్ద కంపెనీల లాభాలకోసం కావాలని చేనేత రంగాన్ని  బలిపెడుతున్న వైనమిది. ఆదిలక్ష్మి దంపతులకు ఇక దిక్కేదీ?

------------

పృథ్వి వెంకటేశ్వర్లు కుటుంబానికి మగ్గం షెడ్డే నివాసం. వైద్యం ఖర్చులకు ఊళ్ళోని తమ ఇంటిని నాలుగువేల రూపాయలకు అమ్మేసుకున్నాక  భార్యాబిడ్డలతో   రామకృష్ణాపురానికి వలసవచ్చాడు.  భార్యాభర్తలు  చెరొకమగ్గంపై పని చేస్తారు. వారికి ఒక కొడుకు , ముగ్గురు అమ్మాయిలు ఉన్నారు.  కొడుకు 8వ తరగతి వరకు చదువుకున్నాడు. అందరికంటే చిన్నది 3వ తరగతి చదువుతోంది. వెంకటేశ్వర్లు కొడుకు వెయ్యిరూపాయల జీతానికి ఒక జూట్‌మిల్లులో పని చేస్తున్నాడు.  ఇటీవలే పెద్ద కూతురు వివాహం జరిపించారు. కుటుంబం మొత్తం కష్ట పడితే వారికి వచ్చేది నెలకు 2,500 రూపాయలు. ఇంటి అద్దెకు, తిండికి పోను పైసా మిగలడం లేదు. పిల్లలను చదివించే స్థోమత వారికిపుడు లేదు. తల్లిదండ్రుల్లాగా నేతపనయినా వారు నేర్చుకోవాలి. లేదంటే వేరే పనులు వెతుక్కోవాలి. వేరే పనుల్లో  కుదిరితే మరీ తక్కువ వేతనానికి పని చేయాల్సి ఉంటుంది

ఈ రెండు కుటుంబాలే కాదు, దాదాపు అందరిదీ ఇదే పరిస్థితి. ఈ కుటుంబాల్లోని అడపిల్లలు, మహిళల పరిస్థితి మరీ దయనీయం. పరిశ్రమలో నెలకొన్న సంక్షోభ పరిస్థితులు, పేదరికం కార్మికులను వలసలు(ఊరినుంచి వృత్తినుంచి), ఆత్మహత్యలకు పురికొల్పుతున్నాయి.

| |
|---|
| **1956 - 57 మరియు 1961 - 62లో సగటున చేనేత ఆదాయం రూ. 1790 మరియు రూ. 2125.**<br>**దీనికి తగిన ఖర్చులు రూ.1161 మరియు రూ. 1281. -** PEO Study No. 61, **ప్రణాళికా సంఘం, 1967** |

- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

Book Post (Printed Matter Only)

Brought out by Centre for Resorce Education (CRE), Plot No. 9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad,

for Centre for Handloom Informatin and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155